THE ANDHRA PATRIKA, MADRAS.



# ఆంధ్రపత్రిక



Regd. No. M, 1118 సంపుటం 38. సంచిక 155 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO బుధవారం 5-9-1951 వెల 1 అణా, హాఫ్ 0-1-2.

# వచ్చే పంటనుంచి ధాన్యసేకరణ ధరలు పెంచడానికి ఆలోచన

## భారత ప్రభుత్వంతో చర్చ: ఆహారమంత్రి హామీ

### ఇతర రాష్ట్రాలతో పోలిస్తే మన ధరలు తక్కువని ప్రకటన

మదరాసు, సెప్టెంబరు 4: యూనియనులోని ఇతర రాష్ట్రాలతో పోలిస్తే ఈ రాష్ట్రంలో సేకరణ ధరలు చాల తక్కువని అంగీకరిస్తూ, వచ్చే పంటకాలము నుండి ధాన్య సేకరణ ధరలను పెంచడాన్నిగూర్చి భారత ప్రభుత్వముతో చర్చించగలమని ఆహారమంత్రి నేడు అసెంబ్లీలో సూచించారు.

ఈసారి ధరలను నిర్ణయించినప్పుడు ఇండియా ప్రభుత్వంతో కలిసి సలహాలన్నింటిని చర్చించెదమని చెప్పారు.

పలువురు సభ్యులు సేకరణ ధరను పెంచవలెనని సూచించగా సేకరణ ధరలకు దిగుమతి అయిన ధాన్యపుధరలకు పోలిక లేదని మంత్రిగారన్నారు. ఇండియా ప్రభుత్వం ఇతర రాష్ట్రాల ధరలనుగూడా గమనించి సేకరణ ధరలను నిర్ణయిస్తుంది. మదరాసులో ధరలు తక్కువైనా ఇండియా ప్రభుత్వమువారి నిర్ణయాన్ని, అందులో ముఖ్యంగా పారిశ్రామిక కేంద్రాలకు సంబంధించినంతవరకు తేలిగ్గా ఆక్షేపించుటకు వీలు లేదన్నారు.

ధరల తేడావల్ల వచ్చే నష్టమును వాణిజ్యంబారపై రుద్దకుండా ప్రభుత్వమే భరించాలని ఒక సభ్యుడు సూచించగా, ఇప్పుడు భరిస్తూవున్న నష్టంకన్న ఎక్కువభారమును ప్రభుత్వం భరించే స్థితిలో లేదని మంత్రిగారన్నారు.

సేకరణ ధర పెంచుటకు వీలుకాని ఎడల, అధికంగా ఉత్పత్తిచేయుటకు ప్రోత్సాహమిచ్చుటకు గాను ప్రభుత్వం బోనసు ఇవ్వాలని సూచన రాగా, బోనసు ఇచ్చే ఆలోచన లేదనీ అధికోత్పత్తికి అనేక ఇతర విధములైన ప్రోత్సాహం ఇవ్వబడుతోందని మంత్రిగారన్నారు.

గోధుమ ధరలుకూడా ఇండియా ప్రభుత్వంవారి ప్రేరణవల్లనే పెంచాం పార్లమెంటులో డిప్యూటీ మంత్రి పారిశ్రామిక కేంద్రాలను ఉద్దేశించి చెప్పివుంటారనుకుంటానని శ్రీ గోపాలరెడ్డి విక్టోరియా ఉపప్రశ్నలకు సమాధానం ఇస్తూ చెప్పారు.

## 'పాకిస్థాన్ ఆక్రమించిన కాశ్మీర్ భూభాగాన్ని విముక్తి చేయాలి'

### జాతీయ మహాసభ అధికారపత్రిక హెచ్చరిక

శ్రీనగర్, సెప్టెంబరు 3: "పాకిస్థాన్ అక్రమంగా ఆక్రమించిన భూభాగాలను శాశ్వతంగా పాకిస్థాన్ చేతులలో వుండనివ్వ వీలులేదు. ఎప్పుడో ఒకప్పుడు ఈ ప్రాంతాలను విముక్తి చేసే బాధ్యత మనపైవున్నది. ఈ పని ఎప్పుడు, ఎలా జరుగుతుంది, అనే విషయం ఇప్పుడు చెప్ప వీలులేదు" అని జమ్మూ కాశ్మీరు జాతీయ మహాసభ అధికార పత్రిక సంపాదకీయంలో నేడు ప్రకటించింది.

"కాశ్మీర్ నందలి పాకిస్తాన్ ఆక్రమిత ప్రాంతాల విముక్తి విషయమై డిప్యూటీ ముఖ్యమంత్రి బక్షీగులాం మహమ్మద్ ఇటీవల చేసిన ప్రకటనపై ఒక బ్రిటిష్ పత్రిక చేసిన వ్యాఖ్యను పురస్కరించుకొని 'ఖిద్మత్' ఈ వ్యాసం వ్రాసింది. జమ్మూ కాశ్మీరు సంస్థానంలో ఈ దినపత్రికకు వున్నంత ప్రచారము మరే పత్రికకూ లేదు. ఇటీవల నెహ్రూ ఢిల్లీలో జరిపిన పత్రికా ప్రతినిధుల సభలో ఈ ప్రకటనపై ఒక ప్రశ్న వేశారని పాఠకులకు జ్ఞాపకం చేయదగును.

"పోరాటము, దాడులు మున్నగునవి జరుగుతవని దీని అర్థం కానప్పటికీ ఈ వాంఛ న్యాయసమ్మతమైనదే" అని ప్రధాని నెహ్రూ చేసిన ప్రకటనకు వార్తమువెలిబుచ్చుచూ ఆ పత్రిక ఇలా వ్రాసింది. "మన డిప్యూటీ ముఖ్యమంత్రి బక్షీగులాం మహమ్మదు చెప్పిన మాటలు మన ప్రజలందరి నిజభావాలను ప్రతిబింబిస్తున్నవి. మనం ఈ విధంగా చెప్పడం మొదటిసారి కాదు. మొదటి నుండి మనవైఖరి ఇట్టిదిగానే వున్నది. నగ్న దురాక్రమణవల్ల పాకిస్థాను ఈ ప్రాంతాలను ఆక్రమించింది. అంతర్జాతీయ న్యాయసూత్రాలకు విరుద్ధంగా ఈ ప్రాంతాలను పాకిస్థాను ఆక్రమించింది. ఈ విషయాన్ని సర్ ఓవెన్ డిక్సన్ అంగీకరించేవున్నాడు. కనుక ఈ దుశ్చర్యవల్ల చేకూరిన ఫలితాలు అక్రమమైనవేకాని అన్యం కాదు. ఈ ఆక్రమణను శాశ్వతంగా సాగనివ్వ కూడదు."

## జపాన్ కమ్యూనిస్టు నాయకుల అరెస్టు

టోకియో, సెప్టెంబరు 3: టోకియో పోలీసులు నేడు ఇచ్చట కమ్యూనిస్టు కార్యాలయాలమీద దాడి సాగించడమేగాక, అగ్రగురు ప్రముఖ కమ్యూనిస్టు నాయకులను అరెస్టుచేశారు.

## 'నెహ్రూ, టాండన్ ఇద్దరూ కాంగ్రెస్‌కు అవసరమే'

### కార్యవర్గానికి యు. పి. శాసన సభ్యుల విజ్ఞప్తి

లక్నో, సెప్టెంబరు 3: కాంగ్రెసులో ఏర్పడిన సంకట పరిస్థితి సంతృప్తికరంగా పరిష్కారం అయేమార్గాన్ని అన్వేషించవలసిందిగా కార్యవర్గాన్ని కోరుతూ, యు. పి. శాసన సభ్యులు 24 మంది ఈ వేళ సంయుక్తంగా ఒక ప్రకటన చేశారు,

"నెహ్రూ లేకపోతే కాంగ్రెసు ఎందుకు కొరగానిదై పోతుంది; అల్లాగే టాండన్ లేకపోయినా గూడా కాంగ్రెసు దుర్బలమై పోతుంది." అని వీరు హెచ్చరిక చేస్తున్నారు.

"ఉదాత్తమైన ఆశయాలు, నిరాడంబరమైన జీవితం, సరళస్వభావం కలిగిన టాండన్ భారత జాతికి పెన్నిధి వంటివాడు. అల్పసంఖ్యాక వర్గాల సంరక్షణనిమిత్తం నెహ్రూ వలెనే టాండన్‌కూడా తన ప్రాణాన్ని సైతం ధారపోయడానికి వెనుతీయడు".

పండిట్ నెహ్రూలో యు. పి. కాంగ్రెసు ప్రకటిస్తున్న విశ్వాసం నామమాత్రమైనదేగాని హృదయపూర్వకమైనది కాదంటూ కొందరు చేస్తున్న ప్రచారం పూర్తిగా నిరాధారం అని వీరు ఖండించారు.

కార్యవర్గ పునర్నిర్మాణంవల్ల కాంగ్రెసులో కొత్త ఉద్రిక్తత నవచైతన్యం ఉద్భవించేటట్లయితే అట్లా పునర్నిర్మించి తీరవలసిందేనని తాను అభిప్రాయపడుతున్నామని కూడా వారా ప్రకటనలో స్పష్టం చేశారు. యీ ప్రకటనమీద క్రిష్ణచంద్, బనార్సీదాస్, మహమ్మద్ వజీం ప్రభృతులు సంతకాలుచేశారు. ఇది ఇలా వుండగా, మరో 11 మంది కాంగ్రెసు శాసనసభ్యులు ఈవిధంగా యింకో ప్రకటన చేశారు:—

వచ్చే ఏ. ఐ. సి. సి. సమావేశంలో సభ్యులు కాలవిలంబనం చెయ్యకుండా, నెహ్రూకు ఆయన ఇచ్చవచ్చిన మార్పులు చేయడానికి కోరిన అధికారం ఇవ్వాలి. ఇప్పుడు అధికారంలో వున్నవారు కాంగ్రెసును బలపరచడానికి తగిన ప్రయత్నం ఏమీ చెయ్యలేదు. ఇదివరకే ఇట్టి ప్రయత్నం జరిగివుంటే, ఇంతమంది కాంగ్రెసును విడిచిపెట్టి పోవటం అంటూ జరిగేదికాదు.

కాంగ్రెసు సంస్థలో అమూలాగ్రంగా వ్యాపించిపోయిన ముఠా తత్వాన్ని చూచి దేశంఅంతా ఏవగించుకుంటోంది.

నెహ్రూమీద మోపబడిన ఆరోపణలకు మాకు చాలా కష్టంకలిగింది. ముఠా తత్వానికి, తంత్రాంగానికి విముఖుడైన నెహ్రూమీద ఇట్టి ఆరోపణలు చేయడంలోనే, ఈ ఆరోపణలు చేసినవారి నైజం బైటపడిపోయింది." ఈ ప్రకటనమీద రఘువీర్ సహాయ్ మోతీలాల్ అగ్రవాలా, మార్య సత్యప్రేమీ ప్రభృతులు సంతకాలు చేశారు.

### సిక్కుల తీర్మానం

అంబాలా, సెప్టెంబరు 3: నెహ్రూ అభీష్టానుసారం కార్యవర్గాన్ని పునర్నిర్మించవలసిందని ఏ. ఐ. సి. సి. ని కోరుతూనూ, భారతదేశానికి సారథ్యం వహించగల నాయకుడు పండిట్ నెహ్రూ ఒక్కడేనని ఉద్ఘాటిస్తూనూ, పంజాబురాష్ట్ర వేపవలిస్టు సిక్కు పార్టీ ఈ వేళ ఒక తీర్మానం చేసింది.

## బియ్యంతో పోతున్న రెండు బోట్లపై పాక్ పోలీసుల దాడి

బసీర్‌హాట్, (24 పరగణాలు); సెప్టెంబరు 3: ఇక్కడికి సమీపమునవున్న ఇచ్ఛామతీనదిలో వెళ్లుచున్న రెండు భారతీయ నాటుబోట్లపై నలుగురు పాకిస్థానీ సాయుధ పోలీసులు గత గురువారంనాడు దాడిచేసి 65 మణుగుల బియ్యమును బలవంతంగా తీసికొని వెళ్లారని పడవవాళ్లు ఇచ్చటి సబ్‌డివిజనల్ ఆఫీసరు యెదుట ఫిర్యాదు దాఖలు చేశారు.

ఫిర్యాదులో ఇలా వున్నది: "సబ్ డివిజనల్ కంట్రోలు ఉత్తరువుల ననుసరించి మేము రెండు బోట్లలో స్థానిక పరపతి సంఘంవారి పక్షాన 272 మణుగుల బియ్యం తీసికొని పోతూవున్నాము. బోట్లు సయ్యద్ పూరు దగ్గరకు చేరగానే రెండు చిన్న నాటుపడవలలో నలుగురు పాకిస్థానీ సాయుధ పోలీసులువచ్చి బోట్లను పాకిస్థాను వైపుగా నడపమని ఆజ్ఞాపించారు.

"భారతదేశం తాలూకు బోట్లలో ఒకటి తప్పించుకోగలిగింది. పాకిస్థానీ పోలీసులు తుపాకులు చూపి రెండవదానిని ఒడ్డుకు తీసికొనిపోయారు. బియ్యమేమైనది, పడవవారి గతి యేమైనది తెలియలేదు."

ఈ ఫిర్యాదు నకళ్ళను పశ్చిమ బెంగాలు ఆహారశాఖమంత్రికి, 24 పరగణాల జిల్లా మేజిస్ట్రేటుకు పంపాడు.

## కొరియాలో కాకేసియన్ సేనల సన్నద్ధం

### 1000 విమానాల సంసిద్ధత: రష్యన్ రాజ్యకూట సహాయం

టోకియో, సెప్టెంబరు 4: టాంకులతో, భారీ ఫిరంగులతో, కవచశకటాలతో అపారసంఖ్యాక, బలంగల కాకేషియన్ సైనిక దళాలు ఉత్తర కొరియాలోని యుద్ధరంగానికి వెనుక భాగంలో సమాయత్తమై వున్నట్లు సమితి రహస్య సమాచార శాఖోద్యోగులు ప్రకటిస్తున్నారు. కమ్యూనిస్టులు కొత్త ముట్టడికి సన్నద్ధులవుతున్న సూచనలు ప్రబలంగా కనబడుతున్నవి. ఇదేగాక, మంచూరియాలో కమ్యూనిస్టులు దాదాపు 1000 విమానాలను కూడా సిద్ధపరచనున్నారు. సోవియెట్ ఉపగ్రహ రాజ్యాలన్నీ, తూర్పు జర్మనీ సహా—ఈ సైనిక బలాలకు సహాయపడినవి.

### అష్టమ సైన్య విజయం

టోకియో, సెప్టెంబరు 14: కొరియా మధ్యరంగ తూర్పు భాగంలో అష్టమ సైన్యం పెద్ద విజయాన్ని సాధించినట్లు నేడు సమితి కార్యాలయం ప్రకటించింది. ఈ సంఘటనలో 2 వేల మంది కమ్యూనిస్టు సైనికులు హాజరైనారు. కొన్ని కీలక పర్వతాగ్రాలు సమితిసేనల అధీనమైనవి.

## గుంటూరు జిల్లాబోర్డు అధ్యక్షుని ఎన్నిక

### రద్దుచేయవలసిందని యిద్దరు సభ్యుల దరఖాస్తు

గుంటూరు, సెప్టెంబరు 1: ఈజిల్లా బోర్డుకు అధ్యక్షుడుగా నల్లపాటి వెంకటేశ్వర్లుగారు ఎన్నికై వుండగా ఆ ఎన్నికను రద్దుచేసి మళ్ళీ ఎన్నికలు జరిపించవలసిందిగా కోరుతూ జిల్లాబోర్డు సభ్యులు వి. సత్యనారాయణ, బి. నాగయ్యగార్లు ఎన్నికల కమిషనరుకు పిటీషను పెట్టుకొన్నారు.

### మద్రాసు శాసనసభ వాయిదా

మద్రాసు సెప్టెంబరు 4: మద్రాసు శాసనసభ ప్రస్తుత సమావేశం నేటితో ముగిసినది. తిరిగి అక్టోబరు 19 వ సమావేశమవుతుంది.

## రైల్వే పనివారి తగాదాలు: ప్రత్యేక పరిష్కార సంఘం

### భారత ప్రభుత్వం నియమించదలచినట్లు జయప్రకాశ్ నారాయణ ప్రకటన

కాశీ, సెప్టెంబరు 3: "రైల్వే పనివారికి, రైల్వే అధికారులకూ మధ్య ఏర్పడే తగాదాలను ఉభయులు చర్చించి పరిష్కరించుకునేటందుకు శాశ్వతమైన సంస్థను నెలకొల్పడానికీ, ఈపద్ధతి విఫలమైతే తగాదాలను మధ్యవర్తి పరిష్కారానికి పంపడానికీ రైల్వే శాఖవారు అంగీకరించారు." అని రైల్వే పనివారి ఫెడరేషన్ అధ్యక్షుడు శ్రీ జయప్రకాశ్ నారాయణ్‌గారు మొఘల్‌సరాయ్‌లో జరిగిన రైల్వే పనివారిసభలో ఉపన్యసిస్తూ చెప్పారు.

ఫెడరేషనువారి ఇతర కోర్కెల విషయమై ఒప్పందం కుదిరేవరకు ఈ ఒడంబడిక అమలులోనికి రాదు. దాదాపు 15 రోజులలోజరిగే మరియొక సభలో రైల్వే పనివారి ఇతర కోర్కెలు చర్చకు వస్తవి. కరువుభత్యాన్ని హెచ్చించే విషయమున రైల్వే మంత్రివర్గంవారు ఒక పత్రాన్ని తయారు చేశారు. దానిలోని సూచనలవిషయమై వారు ఖజానా శాఖతోను, కేంద్ర మంత్రివర్గంవారితోను సమాలోచనలు జరుపుతున్నారు. ఇంకా తుది నిర్ణయాలు జరగకపోవడంచేత ఈ దశలో ఇంతకంటె యెక్కువయేమీ చెప్పజాలను. రైల్వే పనివారి కోర్కెల విషయమై ఒక మెమొరాండమును తయారు చేయాల్సిందని రైల్వే శాఖవారు ఫెడరేషను వారిని కోరారు.

ఒక వారం రోజులలో ఈ మెమొరాండమును మేము వారికి సమర్పిస్తాము వచ్చే సభలో దానివిషయమై చర్చ జరుగుతుంది. ఈ సంభాషణలు ఫలప్రదమైతే మంచిదే. విఫలమైనయెడల రైల్వే పనివారు సమ్మె చేసేనిర్ణయం ఇంకా నిలచియే వున్నది. సమ్మెను వాయిదా వేయడంమాత్రమే జరిగిందని పూర్తిగా విరమించలేదని రైల్వే పనివారు జ్ఞాపకముంచుకోవాలి. సమ్మెను వాయిదా వేసినంత మాత్రమున రైల్వే పనివారు నిరుత్సాహ పడరాదు. పైగా గర్వించాలి. విదేశీయులు దేశంపై దురాక్రమణచేసే భయమేర్పడి వున్నప్పుడు రైల్వే పనివారు తమ స్వార్థమును త్యజించి దేశభక్తి ప్రపూరితమగు నిర్ణయం చేశారు.

## 'మష్రువాలా ఆరోపణలకూ నా మనస్తత్వానికీ పోలికే లేదు'

### కాంగ్రెస్ అధ్యక్షుడు టాండన్ ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 3 తన మనస్తత్వాన్ని గురించి శ్రీ మష్రువాలాగారు చేసిన చిత్రణకూ, తన అసలు మనస్తత్వానికీ ఎక్కడా సారూప్యం లేకపోగా, అవి ఒకదానికొకటి పరస్పర విరుద్ధాలని కాంగ్రెసు అధ్యక్షుడు టాండన్ నేడు ఉద్ఘాటించారు.

ఆయన ప్రకటన సారాంశం ఇది: కిశోరీలాల్ మష్రువాలాగారు నాకు కొన్ని అభిప్రాయాలను అంటగట్టారు. కాని ఆయన ఆరోపించిన అభిప్రాయాలకూ, నా అసలు అభిప్రాయాలకు అసత్యానికీ సత్యానికీ వున్నంతదూరం వుంది.

సవర్ణ హిందూ ఛాందసులకు ప్రతినిధిక్రింద నన్ను జమకట్టడమే గాక, నాలో కొంత ఆర్యసమాజ తత్వం గూడ మిళితమై వుందని ఆయన ఆరోపించాడు. ఆయన చేసిన ఈ వర్ణన వ్యంగ్యచిత్రణం కావచ్చునుగాని, స్వస్వరూపవర్ణన మాత్రం కాదు. నా సర్వమైన ప్రవర్తన, నా గత జీవితం ఇవిఅన్నీ మష్రువాలాగారి ఆరోపణలు అయథార్థం అని చాటుతున్నవి.

ప్రపంచంలోని ఏ గ్రంథాన్నీ, అదెంత పురాతనమైనదైనా, ఎంత పవిత్రమైనదైనా మూఢంగా విశ్వసించరాదనీ, వివేచనకూ, బుద్ధికీ మాత్రమే ప్రామాణ్యం ఇవ్వాలనీ నేను ఇప్పుడే కాదు ఎప్పుడూ చెబుతున్నాను. పోతే ఇక సంస్కృతి విషయానికి వద్దాం. హిందూ సంస్కృతి అనీ, ముస్లిం సంస్కృతి అనీ, వేర్వేరు సంస్కృతులు లేవనీ, సంస్కృతి అనేది దేశాన్ని బట్టి వుంటుంది గాని, మతాన్ని బట్టి కాదనీ, నేను అనేక పర్యాయాలు ఉద్ఘాటించివున్నాను. ఎక్కడో అతి దూరాన హిమాలయాలలో పుట్టి, మార్గమధ్యంలో అనేక ఉపనదులను తనలో కలుపుకుని, అంతకంతకు విశాలమై, వేగవంతమై ప్రవహించే ఒక మహానది వంటిది భారతీయ సంస్కృతి, అని నేను అనేక పర్యాయాలు ఉపమించివున్నాను. ఈ ఉపమానాన్ని బట్టే సంస్కృతి అంటే నా అభిప్రాయం ఏమిటో గ్రహించవచ్చును.

సంస్కృతిలో పాత సంప్రదాయాలు కొత్తసంప్రదాయాలు, రెండూ కలవాలి. ఈ అభిప్రాయాలు మతదృష్టితో కుంచితమైన అభిప్రాయాలు ఎంతమాత్రం కావు. మన జన్మభూమిలోని వివిధ సంప్రదాయాలను తనలో మేళవించుకున్న ఉదారమైన దృక్పథం ఇది.

## ప్రకటన

రేపు 5 వ తేదీ బుధవారం వినాయక చతుర్థి యగుటచే మా కార్యాలయమునకు సెలవు. కాన 6 వ తేదీగల పత్రిక వెలువడదు. మేనేజరు.

## గంటల పంచాంగం

ఖర సం॥ భాద్రపద శు॥ చవితి
1951 సం॥ సెప్టెంబరు 5 బుధవారం శు॥ చవితి సా 5-29 చిత్ర పా 5-0 వర్జ్యం రా 10-29 ల 12-3 కు. వినాయక చతుర్థి. శు॥ పంచమి సెప్టెంబరు 6 గురువారం శు॥ పంచమి ప 4-14 స్వా సా 4-28 వర్జ్యం రా 9-52 ల 11-24 కు.




# ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర, యప్రియము తన మనంబున కగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్. (మహాభారతము)

ఖర సం॥ భాద్రపద శు॥ చవితి
బుధవారం


## ఆంధ్ర నాయకుల తక్షణ కర్తవ్యం

ఆంధ్రరాష్ట్ర సంపాదనకు స్వామి సీతారాం ప్రభృతులు ప్రాయోపవేశం ప్రారంభించి నేటికి 21 రోజులైంది. ఎందుకూ ఉపయోగపడని ఒక అఖిలపక్ష మహాసభను జరపడం మినహా వీరు ప్రాయోపవేశాన్ని విరమించడానికి అనుకూలమైన పరిస్థితులు కల్పించడానికి ఆంధ్ర నాయకులు ఇంతవరకూ ఎట్టి ప్రయత్నమూ చేయలేదు. ఆంధ్ర ప్రజాపార్టీ నాయకుడు ప్రకాశం పంతులు …

… నిర్మాణానికి వీలైనట్టి నిర్ణయానికి రావడం అవసరం. స్వామి సీతారాం ప్రాయోపవేశ విధానాన్ని హర్షింపలేకపోవచ్చును. రాష్ట్ర సంపాదనకు అది ఉత్తమ మార్గమను వారి వాదమును అంగీకరింపలేకపోవచ్చును, ఎన్నికలు ఆసన్నమగుచున్నవి గనుక కాంగ్రెసు వాదులు ప్రజాభిమతమును గౌరవించునట్లు చేయుటకిదే తగిన సమయమని వారు నమ్మినట్లే ఇతరులు విశ్వసింపకపోవచ్చును. కాని స్వామి సీతారాం ప్రభృతులు ప్రాయోపవేశాన్ని విరమించాలనే విషయంలోనైనా ఆంధ్ర నాయకులందరూ ఏకీభవిస్తారనే మా నమ్మకం. యథార్థస్థితిని, వాస్తవిక పరిస్థితులను గమనింపకపోవడం నాయకుల లక్ష్యం గాదు. ఆంధ్ర నాయకులందరూ ఈ సమయంలో అయినా వారందరిపైగల గురుతర బాధ్యతా నిర్వహణలో ఒక …

# జపాన్ శాంతి సభకు రంగస్థలి సిద్ధం

## శాన్ ఫ్రాన్సిస్కోకు ట్రూమన్ ఆగమనం

శాన్ ఫ్రాన్సిస్కో, సెప్టెంబరు 3: జపాను శాంతి సంధి సభను ప్రారంభించేందుకుగాను ప్రెసిడెంటు ట్రూమన్ ఇక్కడికి వచ్చారు. …

## ఫ్రిస్కో సభానిర్వహణ సూత్రాలు

### 11 ముఖ్యదేశాల అంగీకారం

## భారత కమ్యూనిస్టు పార్టీ వారి హర్షం

## సంధి షరతులపై సోషలిస్టుల విమర్శ

… పూర్తిగా మృగ్యం. రెండోది జపాను తన హక్కులను స్వతంత్రంగా ఉపయోగించుకో గల్గుతుంది. అమెరికా సైన్యాలను జపానులో ఉంచడాన్ని గూర్చి సంధివిషయ సంతకాలకు ముందుగానే, ఒక నిర్ణయాన్ని దాని నెత్తిమీద రుద్దడంవల్ల, అది గూడా అడియాసే అయిపోయింది.

## ఇండొనేసియా అస్పష్టవైఖరి

## టోకియోలోని భారత ప్రతినిధి ప్రకటనపై వివరణ

# పాకిస్తాన్ రాయబారికి పర్షియాప్రభుత్వ హెచ్చరిక

న్యూఢిల్లీ సెప్టెంబరు 3: టెహ్రాన్‌లో భారత రాయబారి కార్యాలయం వారు, తమ దేశాన్ని గూర్చి ఇరాన్‌లో సాగిస్తున్న దుష్ట ప్రచారాన్ని అట్లా సాగనీయడాన్ని గూర్చి ఇరాన్ ప్రభుత్వానికి అధిక్షేపణ తెలియజేస్తూ, ఈ ప్రచారం సర్వ అంతర్జాతీయ నడుమంత్ర సూత్రాలకు విరుద్ధంగా ఉన్నదని హెచ్చరించారు. …

… మరో పత్రిక ఈ విషయాన్ని గూర్చి ఇలా వ్యాఖ్యానించింది: పాకిస్తాన్ రాయబారి ఇచ్చట తన పరిపాలన సాగిపోతున్నట్లు వ్యవహరించారు. ఇది టెహ్రాన్ అన్న సంగతి మరిచిపోయి, కారాచీలో వ్యవహరించినట్లు వ్యవహరించాడు.

# 'విభజన సంఘ నివేదిక ప్రాతిపదికగా రాష్ట్రనిర్మాణానికి చర్యలు తీసుకోవాలి'

## రాష్ట్రకాంగ్రెస్ కేంద్రప్రభుత్వాన్ని అభ్యర్థించాలని సర్వసభ్య సమావేశానికి ఉపాధ్యక్షుని తీర్మానం

విజయవాడ, సెప్టెంబర్ 2: ఈ 14వ తేదీన జరుగనున్న ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసుసంఘ సర్వసభ్య సమావేశానికి ఉపాధ్యక్షుడు పసుమర్తి వీరభద్రస్వామి గారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణం …

… చేయాలని, సరిహద్దు తగాదాల పరిష్కారానికి సరిహద్దు సంఘాన్ని నియమించాలని, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలను అర్థిస్తూ తీర్మానించారు. …

## బందరు పురపాలక సంఘ తీర్మానం

## సెప్టెంబరు 9 ఆంధ్రరాష్ట్ర దీక్షాదినం

## సరిహద్దు ప్రాంతాల్లో ప్రశాంత పరిస్థితి

### కావారు డిప్యూటీ కమిషనరు ప్రకటన

## గుడివాడనప్పణ కాంగ్రెసు తీర్మానం

## టాండన్ రాజీనామాతప్పదు

[ఆంధ్రపత్రికకు విలేఖరి]

# వాణిజ్య పంటలపై పన్ను

## సెలెక్టుకమిటీకి పంపుటకు అసెంబ్లీ ఆమోదం

మదరాసు, సెప్టెంబరు 4: మదరాసు అసెంబ్లీలో ఇవ్వాళ ప్రశ్నోత్తరము లయినతరువాత వాణిజ్యపంట భూములపై అదనపుపన్ను విధింపు బిల్లును అసెంబ్లీ సభ్యులతో కూడిన పరిశీలన సంఘానికి నివేదించుటకు సభవారు అనుమతి ఇచ్చారు. …

## రెవెన్యూ మంత్రి జవాబు

## జమీందారీల రద్దు శాసన సవరణ బిల్లు

రివిన్యూమంత్రి శ్రీ సీతారామిరెడ్డి గారు జమీందారీల రద్దు శాసనం సవరణ బిల్లును సభవారు వెంటనే ఆలోచనకు తీసుకోవాలని ప్రతిపాదిస్తూ బిల్లు ఉద్దేశ్యాలను యీ విధంగా వివరించారు, జమీందారీలకు మొత్తం 12½ కోట్ల రూపాయలు నష్ట పరిహారం యివ్వటానికి జమీందారీల రద్దు శాసనంలో నిర్ణయమైంది. జమీందారీల కిచ్చే పరిహారముల మొత్తం ఒకవేళ పై మొత్తానికి తగ్గితే 12½ కోట్ల రూపాయల మొత్తము నందు మిగిలే మొత్తాన్ని అన్ని జమీందారీలకు సరిసమానంగా పంచి వేయటానికి నుద్దేశింపబడింది.

ఈ సెక్షను జమీందారీలకు మాత్రమే వర్తిస్తుంది, గాని చిన్న లోపాయకారి ఎస్టేట్లకు వర్తించదు. ఆనష్ట పరిహార పంపకములో పాయకారి ఎస్టేట్లకు సయితం వర్తింప చేయడమే యీ బిల్లు ఉద్దేశ్యమని తెలిపారు.

శ్రీ యం. జె. వత్సేకి శెట్టియార్ గారు నష్ట పరిహార మివ్వగా మిగిలే మొత్తమును జమీందారీలకే సమానంగా పంచాలిగాని లోపాయకారి ఎస్టేట్లకు యివ్వరాదని విజ్ఞప్తి చేశారు.

అంతటితో సభ మధ్యాహ్నానికి వాయిదా పడింది.

## పంజాబులో వస్త్రం కంట్రోలు తొలగింపు

# శ్రీకాకుళం జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు

## తమ్మినేని పాపారావుగారి ఎన్నిక

శ్రీకాకుళం సెప్టెంబరు 3: నేటి సాయంకాలం బెండి కూర్మన్నగారు నిర్వహించిన యీ జిల్లా కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నికలో తమ్మినేని పాపారావు గారు గెలిచారు. పాపారావు గారికి 92, వీరి ప్రత్యర్థి చల్లా నరసింహం గారికి 78 ఓట్లు వచ్చాయి. ఈ ఎన్నిక …

## పశ్చిమ గోదావరిజిల్లాకాంగ్రెస్ కార్యవర్గం ఎన్నిక

## నెల్లూరుజిల్లా కాంగ్రెసు

## చిత్తూరు జిల్లాకాంగ్రెసు కార్యవర్గ ఎన్నికలు

… ఎన్నికైనారు. సహాయ కార్యదర్శి స్థానానికి పోటీచేసిన గురవారెడ్డి గారికి 40, వీరి ప్రత్యర్థి విశ్వనాథం గారికి 29 ఓట్లు వచ్చాయి. గురవారెడ్డిగారు ఎన్నికైనట్లు ప్రకటించబడింది. కార్యవర్గ సభ్యుల ఎన్నికతో కార్యక్రమం ముగిసింది. (స్వ. వి)

## మద్రాసు ఆంధ్రజిల్లా కాంగ్రెసులో చీలిక

### రెండు కార్యవర్గాల ఎన్నిక

మద్రాసు, సెప్టెంబరు 4: నూతన కార్యవర్గ ఎన్నికవిషయమై తగాదా వచ్చి, మద్రాసు ఆంధ్రజిల్లా కాంగ్రెసుసంఘం రెండువర్గాలుగా చీలిపోయింది. రెండు, విడివిడిగా కార్యవర్గాలను ఎన్నుకొన్నాయి. ఈ సందర్భంలో యీ దిగువ వివరాలు తెలియవచ్చినవి.

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు ఆదేశానుసారం, మద్రాసుజిల్లా కాంగ్రెసు సంఘ సభ్యులు నూతన కార్యవర్గ ఎన్నిక నిమిత్తం నిన్న సాయంకాలం 3 గం॥లకు జిల్లా కాంగ్రెసు కార్యాలయం (ట్రిప్లికేన్ హైరోడ్డు 750 భవనం)లో సమావేశమైనారు. ఎన్నిక జరిపించవలసిన యం. హనుమంతరావుగారు ఏ కారణంవల్లనో సమావేశానికి రాలేకపోయినారు. ఎన్నికను వాయిదా వేయాలనే సూచనపై అంగీకారం కుదురలేదు. పర్యవసానంగా కొందరు …

… రామారావు గుప్త గారిని కార్యదర్శిగను శ్రీమంతు పెంచలరెడ్డి, గద్దె …ండయ్య, ముప్పా రమణయ్య, బోడిపూడి నర్సయ్య, యం. సీతారామనాయుడు డి. జయరాం ఇన్నా సెంకట్రామతాత్య చెట్టి యల్. యల్. పటేల్, కొమ్ము రాఘవయ్య, బి. యస్. కర్త బి లక్ష్మీనారాయణగార్లను కార్యవర్గ సభ్యులుగను ఎన్నుకొన్నారు.

కె. మంగాచారి, సి ఆదిశేషు, నిప్పట్ల కోటయ్యగార్లను క్రెడిన్షియల్ కమిటీకి, బింజమూరి రంగాచారి, పి యస్ భాష్యం శెట్టి డి. ఆర్. కృష్ణారావు గార్లను జిల్లా ఎన్నికల ట్రిబ్యూనల్‌కు ఎన్నుకొన్నారు.

రెండవ వర్గంవారు ఆర్. సూర్యనారాయణగారి అధ్యక్షతన జిల్లా కాంగ్రెసు కార్యాలయంలో సమావేశమై యీ దిగువవారిని కార్యవర్గమునకు ఎన్నుకొన్నారు. అధ్యక్షులు శ్రీ కె. వి. స్వామి, ఉపాధ్యక్షులు శ్రీ ఆర్. సూర్యనారాయణ యం. సీతారాం నాయుడు ప్రధాన కార్యదర్శులు శ్రీ బత్తె పట్టి వెంకటసుబ్బయ్య నాయుడు, శ్రీ బి. సి. గోవిందు, కార్యాలయ కార్యదర్శి శ్రీ కావూరు పట్టాభిరామయ్య, కోశాధికారి శ్రీ పందిరి మల్లికార్జునరావు, కార్యవర్గ సభ్యులు యం. ధనపాల్, బి. సి. నాగయ్య, కె. పాల్, యస్. ఎల్లయ్య, ఆర్ యస్. కన్నయ్య, జి. కోటీరత్నం, బోడిపూడి నర్సయ్య, మందు పాం …

# స్వామిజీ ప్రాయోపవేశంపట్ల ఆందోళన

## భారత ప్రధానికి 25 గురు శాసనసభ్యుల అత్యవసర తంతి

మద్రాసు, సెప్టెంబరు 4: స్వామి సీతారాం ప్రభృతులను ప్రాయోపవేశాన్ని విరమింపచెయ్యడానికి, భారత ప్రధాన మంత్రి సత్వర చర్య తీసుకోవాలని నచ్చచెప్పడానికి అన్నాప్రగడ కామేశ్వరరావు ఎం. ఎల్. ఎ గారు …

## భారత ప్రధానికి శాసన సభ్యుల విజ్ఞప్తి

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras.

